**SRINIVASA BALABHARATI - 87**
***(Children Series)***

**HAYAGREEVUDU**

*By*

***Dr. D. Sridhara Babu***

T.T.D.Religious Publications Series No.: 942



First Edition : 2015

Copies :

*Published by*

**Dr. D. SAMBASIVA RAO I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*D.T.P. :*

Editor-in-Chief Office, TTD, Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,Tirupati.

**శ్రీనివాస బాలభారతి - 87**

# హయగ్రీవుడు

రచన
**డా॥ డి.శ్రీధరబాబు**

ప్రచురణ
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**
**2015**

## ఆముఖం

చిన్నపిల్లల మనసులు చల్లనైనవి, నిర్మలమైనవి. చక్కగా పెరిగిన పిల్లలు భావిభారత పౌరులై మంచి సభ్యత సంస్కారం పెంచుకొని, తమ కుటుంబానికి, దేశానికి కూడ పేరుప్రతిష్ఠలను సంపాదించి గర్వకారణమౌతారు. మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహాపతివ్రతలు ఎలాంటివారు, వారంత గొప్పవారెలా అయినారనే విషయం, వారికథలు చెపుతూ పిల్లలకు తెలియజేయగలిగితే, వాటి ప్రభావం లేతమనస్సులపైన చక్కని సంస్కారముద్రలను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతగానో ఉపయోగపడతాయి.

ఈ ఉద్దేశ్యంతోనే ''శ్రీనివాస బాలభారతి'' అనే పుస్తకమాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తోంది. ఇందులో మన భారతదేశంలో అనేక ఆదర్శాలలో ప్రసిద్ధులైన మహాత్ముల చరిత్రలు చిన్న చిన్న వాక్యాలలో చక్కని కథాకథన పద్ధతిలో చెప్పడం జరుగుతుంది. చిన్నారి బాలలు వీటిని బాగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.



కీ.శే.డా॥ ఎస్.బి.రఘునాథాచార్యగారు రూపొందించిన ఈ ప్రణాళికను కొనసాగిస్తూ అదే శీర్షికన చాలా పుస్తకాలను ప్రచురింపజేయటంతోపాటు వాటిని హిందీ, ఆంగ్లం మున్నగు ఇతర భాషల్లోనికి అనువదింపజేస్తున్న ప్రచురణలవిభాగం ముఖ్యసంపాదకులు అభినందనీయులు. ఈ ప్రణాళికలో సహకరించిన రచయితలకు, కళాకారులకు మా ధన్యవాదాలు.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# ఒక్క మాట

చిన్నపిల్లల్లో ధార్మిక జ్ఞానాన్ని కల్గించాలని, బాల్యంలో కల్గిన జ్ఞానం జీవితాంతం వారికి ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ 'శ్రీనివాస బాలభారతి' పథకాన్ని ప్రారంభించింది. దీనికి అప్పట్లో ప్రధాన సంపాదకులుగా ఉండిన ప్రముఖ పండితులు, రచయితలు, మాజీ ఉపకులపతి డా॥యస్.బి.రఘునాథాచార్యులవారు ఈ గ్రంథాలను పరిష్కరించి తీర్చిదిద్దారు. వీరి నేతృత్వంలో కొన్ని వేల ప్రతులను చిన్న పిల్లలకు అందించడం జరిగింది.

మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహా పతివ్రతలు, మహావీరులు భారతీయ సంస్కృతికి చక్కని పునాదులు.వారి జీవిత గాథల్ని సరళ సుందరశైలిలో, అందమైన ముద్రణతో వెలుగులోకి తేవడం జరిగింది. ప్రస్తుతం ఆ పుస్తకాలతో పాటు మరికొన్నింటిని కొత్తగా చేర్చి దేవస్థానం ముద్రించింది. భావి భారత పౌరులైన పిల్లలకు ధార్మిక సాహిత్య పరిచయం కల్గించాలనే సత్సంకల్పంతో తి.తి.దే. వీటిని అందిస్తోంది.

తల్లిదండ్రులే పిల్లలకు ప్రథమ గురువులు. కనుక వారు కూడా ఈ 'శ్రీనివాస బాలభారతి' రచనలను ఆదరించి, పఠించి వాటి ప్రాముఖ్యమును పిల్లలకు తెలియచేసి వారిచేత చదివించాలి. అప్పుడే ఆ బిడ్డలు అందరూ ఆదర్శ వంతులుగా తీర్చిదిద్దబడతారనడంలో సందేహం లేదు. నేటి మొక్కలే రేపటి వృక్షాలు కనుక ఇప్పటినుండి పిల్లలలో నైతికములైన విలువలను, ఆధ్యాత్మిక చింతనను పెద్దలు అలవాటుచేస్తే భవిష్యత్తులో ఉత్తమ పౌరులుగా వెలుగొందుతూ ఆదర్శజీవితం సాగించగలరు. ఆ ఈ సంకల్పానికి ఈ బాలభారతి గ్రంథాలు చేయూతనివ్వగలవని మా విశ్వాసం.

ముఖ్య సంపాదకులు

# హయగ్రీవుడు

హయగ్రీవుడు విష్ణుమూర్తి అనేక అవతారాల్లో ఒక అవతారం. రాముడు, కృష్ణుడు ఆ మహావిష్ణువు అవతారాలే. అయినా ఈ అవతారంలోని విశేషం ఏమిటంటే మెడ క్రిందిభాగం అంతా మనిషిరూపం. మెడనుండి పైభాగం అంతా గుర్రపు రూపు ఉండటం. అందుకనే ఈ విష్ణురూపాన్ని హయగ్రీవుడు అని పిలుస్తారు. అంటే గుర్రపు మెడ కలవాడని అర్థం. ఈ దేవుణ్ణే హయశీర్షుడు అని కూడా అంటారు. అంటే గుర్రపు తలవాడని అర్థం.

## సర్వవిద్యలను ప్రసాదించే దైవం :

అసలు విష్ణువు గుర్రపు తలను ఎలా పొందాడనే విషయాన్ని గురించిన కథలు తరువాత చెప్పుకొందాం. ముందు ఈ దేవుడి గొప్పతనం ఏమిటో ఆలోచిద్దాం. ఈ దేవుడిని ప్రత్యేకంగా ఎందుకు కొలుస్తారో విచారిద్దాం. హయగ్రీవస్వామి భక్తులకు సర్వవిద్యలను ప్రసాదించే దైవం. విద్యావిజ్ఞానాలు



కావలసినవాళ్ళు ఈ దైవాన్ని ఎలా ప్రార్థిస్తారో తెలుసా! చాలా ప్రచారంలో ఉన్న ఈ దేవుణ్ణి గురించిన ప్రార్థన ఇది-

**జ్ఞానానందమయం దేవం**
**నిర్మల స్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం**
**హయగ్రీవ ముపాస్మహే ॥**

"జ్ఞానం ఆనందం ఈ రెండూ ఆకారం దాల్చిన, నిర్మలమైన స్ఫటికాన్ని పోలిన రూపంతో, సర్వవిద్యలకు ఆధారమైన హయగ్రీయదైవాన్ని ఉపాసిస్తున్నాను" అని ఈ శ్లోకం యొక్క భావం.

చూడండి! మనం చదువుకోసం "సరస్వతీ నమస్తుభ్యం" - "సరస్వతీ నీకు నమస్కారం!"అని చదువుల తల్లి సరస్వతీదేవిని ప్రార్థిస్తాం. అలాగే అజ్ఞానాన్ని పటాపంచలు చేయడానికి, జ్ఞానాన్ని ప్రసాదించడానికి దక్షిణామూర్తి రూపంలోవున్న శివుణ్ణి ఆరాధిస్తాం. స్త్రీ దేవతలలో సరస్వతిలాగ



శివరూపంలో దక్షిణామూర్తిలాగ విష్ణువు అవతారాల్లో హయగ్రీవస్వామి జ్ఞానస్వరూపుడు, విద్యాధిష్ఠాన దైవం.

## దేవుళ్ళకు జంతువుల తలకాయ లేమిటి?

హయగ్రీవునిలాంటి రూపం చూడటానికి మనకి ఏదో వింతగా కన్పిస్తుంది. కొంతవరకు మనుష్యరూపంలో ఉండి చేతుల్లో శంఖచక్రాలు ధరించి గుర్రపు తలతో ఈ మూర్తి కన్పించడం అసలు జంతువుల రూపాలకి మనుష్యరూపాలకి ఈ కలయిక ఏమిటా అన్న ప్రశ్న రాక తప్పదు. మన పురాణాల్లో, మహాభారతంవంటి మన ప్రాచీన ఇతిహాసాల్లో ఈ రూపాలు ఆ యా దేవుళ్ళకు ఎలా వచ్చాయో వివరించే అనేక గాథలు ఉన్నాయి. శైవ సంప్రదాయంలో విఘ్నేశ్వరుణ్ణి చూడండి ! ఏనుగుతొండంతో మనకు కన్పిస్తాడు ఆ దైవం. దీని వెనుక అసలు ఈ ఏనుగు తలకాయ ఈ దేవుడికి ఎలా అతకబడిందో ప్రాచీనగ్రంథాల్లో వివరించి చెప్పే కథలు ఉంటాయి. అలాగే హయగ్రీవుని గురించిన ప్రాచీనకథలు తర్వాత చెప్పుకొందాం.

సుప్రసిద్ధమైన విష్ణువు దశావతారాల్లో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామకృష్ణాదుల్లో మత్స్య కూర్మ వరాహాలు పూర్తిగా జంతురూపంలో ఉన్నాయి. అయినా శిల్పి శిల్పం చెక్కేటప్పుడు, చిత్రకారుడు ఆ యా దేవతల్ని చిత్రించేటప్పుడు ఆ యా జంతువుల రూపాల్ని మనుష్య రూపంతో జోడించి విష్ణుచిహ్నాలైన శంఖం, చక్రం, గద, ఖడ్గం మొదలైన వాటితో అలంకరింపజేసి చిత్రీకరించడం కూడా కద్దు. అలా జంతురూపాలతో మిళితమైన మానవరూపం విష్ణువుకు ఇవ్వడం ఆచారమైంది. కొన్ని కొన్ని సందర్భాల్లో మత్స్య కూర్మ రూపాలు క్రిందభాగం అంతా ఉంటే పైభాగం మనుష్యరూపంలో విష్ణువు రూపాన్ని ప్రదర్శించడం కనిపిస్తుంది.

వరాహావతారంలో వరాహరూపంలో విష్ణువు భూగోళాన్ని హిరణ్యాక్షుడు అనే క్రూర రాక్షసుడి బారినుండి రక్షించడం ఇతివృత్తం. మన శిల్పాల్లో, చిత్రాల్లో వరాహపు తల మిగిలిన శరీరభాగాలన్నీ మనుష్య రూపంలో



ప్రదర్శించడం ఆచారంగా వుంది. ఈ మాదిరిగానే గుర్రపు తల గల మన హయగ్రీవ రూపం గల దేవుని కథ కూడా వుంది. అయితే వరాహ అవతారాన్ని మనుష్యరూపంతో జతచేర్చి చూపించే పద్ధతిలో మాత్రం లేదు. ఏవో కొన్ని కారణాలవల్ల విష్ణువు తన సహజమైన తలని పోగొట్టుకొంటే గుర్రపు తలని ఆ స్థానంలో అతికించిన సందర్భం ప్రాచీన కథల్లో కనిపిస్తుంది. ఇవన్నీ తర్వాత తర్వాత చెప్పుకొందాం.

## హయశిరస్సుతో ఉన్న ఇతర దేవతలు :

హయగ్రీవుడు గుర్రపుతల ఉన్న దేవుడని ఇప్పటికే తెలిసిపోయి వుండాలి. ఇలా గుర్రపు తల కల దేవుళ్ళు మన పురాణాల్లో ఇంకా ఎవరైనా వున్నారా? ఈ ప్రశ్నకు ఉన్నారనే సమాధానం వస్తుంది. మన పురాణాల్లో తటస్థపడే గంధర్వ జాతికి సంబంధించిన వారు గుర్రపు ముఖాలతో, చిలక ముఖాలతో కనిపించడం ఉంది. అలాంటి వాళ్ళల్లో తుంబురుడు ఒకడు. తుంబురుడు, నారదుడు పెద్ద





సంగీతవేత్తలు, మహాభక్తులు, వైణికులు. గుర్రపు తల గల చేతులతో వీణపట్టుకొని మీటుతున్న తుంబురుడు విష్ణురూప మైన హయగ్రీవస్వామికి భిన్నంగా విలక్షణంగా ఉంటాడు. వీరిలో తేడా చూపే విలక్షణత హయగ్రీవస్వామి నాలుగు చేతులతో విష్ణుచిహ్నాలతో ఉండటం. తుంబురుడు సామాన్యంగా రెండు చేతులతోనే కనిపించడం.

అప్పుడప్పుడు కల్కి అవతారాన్ని గుర్రపు ముఖంతో చూపించడం ఆచారంగా కూడా ఉంది. అయినా ఇది కల్కి అవతారానికి సంబంధించిన గాథకు పొత్తు లేకుండా ఉంది. విష్ణువు ఎత్తబోయే అవతారం కల్కి అవతారం. ఒక బ్రాహ్మణ కుమారుడు కత్తిని చేతబూని, ఒక చక్కని తెల్లని గుర్రంతో అవతరించి శత్రుసంహారం చేస్తాడని భావం. ఈ భావమే దైవాన్ని శిల్పంలో చెక్కేటప్పుడు కల్కి అవతారానికి గుర్రంతో ఉన్న సంబంధాన్ని పురస్కరించుకొని కల్కికి గుర్రపు తలపెట్టి శంఖచక్ర చిహ్నాలతో చూపించడం అప్పుడప్పుడు కనిపిస్తుంది. అయినా విష్ణుచిహ్నాలైన శంఖచక్రాలతోబాటు తప్పనిసరిగా విష్ణుస్వరూపమైన హయగ్రీవుని చేతుల్లో జ్ఞానదాయకాలైన

వేదాలకు చిహ్నంగా ఒక పుస్తకం ఆయనకున్న నాలుగు చేతుల్లో ఒక దానిలో ఉంచడం ఈ దేవుని లక్షణాల్లో ప్రత్యేకత. అలా మిగిలిన గుర్రపు తల ఉన్న దేవతలకు భిన్నంగా హయగ్రీవుణ్ణి గుర్తించవచ్చు. ఒకవేళ అశ్వనీదేవతలను గుర్రపుతలతో చూపెట్టినా వాళ్ళెప్పుడూ జంటగా ఉండటంవల్ల, వాళ్ళకు విష్ణు చిహ్నాలు ఏమీ లేకపోవడంవల్ల శంఖచక్ర పుస్తక అక్షమాలాధరుడైన విష్ణు హయగ్రీవ రూపంలోని విలక్షణతను మనం తేలికగా గుర్తించవచ్చు.

## విష్ణువు గుర్రపు తలని పొందిన విధం :

మన సంస్కృతికి, సభ్యతకి వేదాలు మూలకందాలు. మన మత భావనలకి, తాత్త్విక ధోరణులకి వేదాలు ఆధారశిలలు. తర్వాత తర్వాత విలసిల్లిన మన పురాణగాధలకి, సమాజంలోని ఆచారవ్యవహారాలకి వేదాల్లో బీజాలు కనుపిస్తాయి. అందుకనే అనేక విషయాలను గురించి పరిశీలన చేసేటప్పుడు మన సంస్కృతికి సంబంధించిన మేరకి వేదాలవైపు మళ్ళడం, వేదాల్లో వాటిని గురించిన ఆధారాల



కోసం వెదకడం సంభవిస్తుంది. ఆ రీతిగానే హయగ్రీవ రూపానికి సంబంధించిన అంకురాలు వైదిక సాహిత్యంలో మనకి కనిపిస్తాయి. ఇక్కడ మనం కొన్ని విశేషాలు విష్ణువుని గురించి తెలుసుకోవాలి.

వైదిక దేవతల్లో ఇంద్రుడు, వరుణుడు మొదలైన వారివలె విష్ణువు కూడా ఋషుల ప్రార్థనలను అందుకొన్నాడు. ముఖ్యంగా ఋగ్వేదంలో విష్ణురూపం ఆదిత్య సంబంధంగా అంటే సూర్య సంబంధంగా ఉండేది. తర్వాత తర్వాత యజ్ఞ యాగాది క్రతువుల ప్రాధాన్యం పెరిగినప్పుడు యజ్ఞం విష్ణుస్వరూపమే అనే భావన కూడా వచ్చింది. అసలు యజ్ఞం అంటే ఏమిటో తెలుసా? ఒక అగ్నివేదికను తయారుచేసి ఆ అగ్నిలో నెయ్యి, ధాన్యం, సమిధలు వంటివి ఆహుతులుగా సమర్పించి ఆ యా దేవతలను ఆరాధించే పద్ధతి. ఇక్కడ దైవారాధనకి ఒక విగ్రహం, ఒక ప్రత్యేక రూపం అవసరం లేదు. అగ్నిద్వారా ఆ యా దేవతలకు హవిస్సులను అర్పించే అమూర్త అర్చనా విధానం ఇదే. అలాంటి యజ్ఞం విష్ణువే



అనే భావనలో మన హయగ్రీవుడి కథకు కొన్ని ఆధారాలు కన్పిస్తున్నాయి. అనేక యాగాల్లో సోమయాగం ఒకటి. ఈ యాగంలో ముఖ్యం సోమరసాన్ని దేవతలకు అర్పించడం. ఈ యాగం చేసే ముందు మూడు రోజులబాటు 'ప్రవర్గ్య' అనే క్రియాకలాపం నిర్వహిస్తారు. ఈ 'ప్రవర్గ్య' అసలు సోమయాగానికి ఒక ముఖ్యమైన అంశం. అంటే మనుష్యశరీరంలో శిరస్సు ఎంత ప్రధానమో ఈ ప్రక్రియ ఆ సోమయాగానికి అంత ప్రధానం. ఒకవేళ అది ఆచరించకపోతే మొత్తం యాగప్రక్రియ అంతా శిరస్సులేని మొండెంలా అప్రధానం అవుతుంది. ఇందాకనే చెప్పుకొన్నాం 'యజ్ఞం అంటే విష్ణువు' అని. ఈ యజ్ఞం శిరస్సు వంటి 'ప్రవర్గ్య' లేకపోతే నిరుపయోగమే అవుతుంది. దీన్ని కథలా సంకేతంగా చెప్పాలి. అలా సంకేతంగా సూచించి చెప్పే కథని ఆఖ్యాయిక అంటారు. అలాంటి ఒక వైదిక ఆఖ్యాయికలో యజ్ఞంతో పోల్చబడి సారూప్యం చెప్పబడే విష్ణువు తలని పోగొట్టుకొనడం, తలలేని ఆ విష్ణువు మొండేనికి అశ్వనీదేవతలు గుర్రపు తలని అతికించడం ఒక ఆఖ్యాయికగా రూపొందింది. దీనిలో ఒక



విశేషం ఉంది. ప్రవర్గ్య అనే ప్రక్రియలేని సోమయాగ కలాపం యొక్క అప్రాధాన్యతను నిరూపించడానికి చెప్పిన కథ ఇది.

## విష్ణువుకు గుర్రపు తల :

దీనిలో విష్ణువు కరచరణాదులున్న మానవరూపంలో ఉంటే ఆ యజ్ఞపురుషుడైన విష్ణువు తల పోగొట్టుకొన్నాడు అని చెప్పడంలో ఒక సంకేతార్థం మాత్రం ఉంది. విష్ణువుతల బదులు గుర్రపు తల అతికించే పనికి దేవవైద్యులు అశ్వినులు నిర్వహించారు. అసలు దీనికి సంబంధించిన కథ ఇలా ఉంది. ఒకప్పుడు దేవతలు అంతా కలిసి ఒక సత్రయాగం చేయాలని తలపెట్టారు. కురుక్షేత్రం వారు ఎన్నుకొన్న యాగభూమి. వారంతా యజ్ఞాన్ని సంకల్పించి, ఆ యజ్ఞఫలాన్ని, ఆ యజ్ఞం వల్ల వచ్చే యశస్సును సమానంగా పంచుకోవాలనే అంగీకారంతో నిర్వహించారు. అయినా యజ్ఞం అంతా అయిన తర్వాత విష్ణువే అంత యశస్సునీ, ఫలాన్నీ తనదిగా చేసుకొన్నాడు. అగ్ని, ఇంద్రుడు, వాయువు మొదలైన ఇతర దేవతలు నోరెత్తకుండా తన ధనుర్బాణాలతో నిటారుగా నిలబడి

వెళ్ళగొట్టాడు. మిగిలిన దేవతలు ఏదో రకంగా దీనికి ప్రతీకారం చెయ్యాలని తలపెట్టారు. వాళ్ళు 'వమ్రీ' అనబడే చెద పురుగుల్ని సృష్టించారు. విష్ణువు చేతిలోని ఎక్కుపెట్టిన ధనస్సుకు ఉన్న అల్లెతాడుని (నారిని) ఆ చెద పురుగులు కొరికేసాయి. అప్పుడు వింటితాడు తెగి విష్ణువుతల త్రుంచ బడింది. దేవతలు యజ్ఞవిష్ణువు తల ఎగిరిపోవడంవల్ల ఆ తలని అతికించే బాధ్యత అశ్వినీదేవతలకు అప్పగించారు. అశ్వినులు ఈ పనిని నిర్వహించారు. వేదకథలో అశ్వినులు విష్ణువుకి గుర్రపుతల అమర్చారు అన్నది స్పష్టంగా కనిపించక పోయినా దేవీ భాగవతంలో, స్కందపురాణంలో విష్ణువుకి గుర్రపు తల అమర్చారు, అది విష్ణువురూపాల్లో ఒకటి అన్నది విశదంగా కనిపిస్తూ, ప్రస్తుతం ఆరాధింపబడుతున్న హయగ్రీవ విష్ణురూపానికి పూర్వయితివృత్తంగా ఉంది.

**వేదపరిరక్షణ :**

వేదాలు మన జ్ఞానభాండాగారాలు. వేద పరిరక్షణ హయగ్రీవ అవతార ప్రయోజనం అని చెప్పేకథ



మహాభారతంలో ఇలా ఉంది. ఒకప్పుడు బ్రహ్మ విష్ణువునాభి నుండి ఉద్భవించిన వేయిరేకుల కమలం మీద వేదాలతో కూర్చొని ఉన్నాడు. అప్పుడు తమోగుణం ఆకారంగా దాల్చిన మధువు, రజోగుణం రూపం ఎత్తిన కైటభుడు అనే రాక్షసులు ఆ వేదాలను దొంగిలించాలని తలపెట్టారు. బ్రహ్మ అజాగ్రత్తగా ఉండటం కనిపెట్టి వేదాలను ఎత్తుకొనిపోయారు. పాతాళలోకానికి పారిపోయారు. బ్రహ్మకు వేదాలు నేత్రాలవంటివి. వేదాలను పోగొట్టుకొని జ్ఞాననేత్రాన్ని పోగొట్టు కొన్న అజ్ఞానాంధుని వలె బాధపడ్డాడు బ్రహ్మ. వేదాలను సాధించి తిరిగి పట్టుకొని రమ్మని విష్ణువుని ప్రార్థించాడు. ఆ ప్రార్థన విని యోగనిద్ర నుండి విష్ణువు మేల్కాంచాడు. దివ్యదృష్టితో మధుకైటభులు వేదాలను ఎక్కడికి పట్టుకొని పోయారో చూశాడు. ఆ రాక్షసుల్ని సంహరించడానికి వేదాల్ని తిరిగి పట్టుకొనిరావడానికి విష్ణువు సత్త్వస్వరూపుడైన హయగ్రీవావతారం ఎత్తాడని మహాభారత కథనం. వేదోద్ధరణతో హయగ్రీవునికి వున్న ఈ సంబంధంవల్ల ఈ దేవుడు జ్ఞాన



ప్రదాతగా పేరుపొందాడు. అసలు వేదాలంటేనే జ్ఞానం యొక్క గనులని కదా!

**పురాణాల్లో హయగ్రీవ గాథలు :**

అస్సాం ప్రాంతంలో బాగా ప్రచారంలో ఉన్న కాళికాపురాణంలో హయగ్రీవ సంబంధమైన ఒక కథ ఉంది. జ్వరాసురుడు అనే రాక్షసుణ్ణి సంహరించడానికి హయగ్రీవుడు ఆవిర్భవించాడని ఈ పురాణం చెబుతుంది. మణికూట పర్వతశిఖరంపై హయగ్రీవ విష్ణువుకి; జ్వరాసురుడికి పెద్ద యుద్ధం జరిగింది. అక్కడే ఈ దుష్టరాక్షసుడు చంపబడ్డాడు. ఈ మణికూటంమీద ఇప్పటికీ హయగ్రీవుడి గుడి ఉంది. ఇక్కడ ఆ దేవుణ్ణి హయగ్రీవ మాధవుడు అని పిలుస్తారు. ఈ ప్రదేశం అస్సాంలో 'హజో'అనే చోట ఉంది. ఇది గౌహతి పట్టణానికి దగ్గరలో ఉన్న ఒక చిన్నపల్లె.

పురాణాల్లో, మహాభారతంలో అనేక కథలు కని పిస్తున్నా ఒక విషయం మాత్రం స్పష్టం. హయగ్రీవుడు విష్ణువు



అవతారాల్లో ఒక అవతారం అని, మామూలు దశావతారాల జాబితాలలో మనకి ఈ అవతారం కనిపించకపోయినా ధర్మసంస్థాపనకి ఆ యా సందర్భాల్లో అవతారం ఎత్తిన విష్ణురూపాలలో హయగ్రీవస్వామి ఒకడు అని విష్ణుపురాణం, మత్స్యపురాణం, వామన పురాణం, భాగవత పురాణంవంటి ప్రాచీన గ్రంథాలు ఎలుగెత్తి చాటుతున్నాయి.

ప్రస్తుతానికి జ్ఞానం కావాలంటే హయగ్రీవుని ఉపాసించాలనే సంప్రదాయం బాగా నిలదొక్కుకొని ఉంది. హయగ్రీవుని ఆరాధించి గాలవుడనే ఋషి చాలా గొప్పస్థితి పొందినట్లు మహాభారతంలో ఒక గాథ ఉంది. ఈ గాలవుడు పాంచాలదేశానికి చెందినవాడు. శివుని ప్రేరణవల్ల హయగ్రీవ స్వామిని ఆరాధించి వేదాల్ని చక్కగా 'క్రమపాఠం'గా ఉచ్చరించే రీతిలో ప్రజ్ఞాశాలి అయ్యాడని, అదేకాక 'శిక్ష' అనబడే ఒక వేదాంగాన్ని ఆదిలో కనుక్కున్నాడని అతడు మహాజ్ఞాని అని ఈ కథలో ఉంది.

బ్రహ్మాండపురాణంలో హయగ్రీవుడు అగస్త్యమహర్షికి ప్రత్యక్షమై దేవీమాహాత్మ్యాన్ని వర్ణించి లలితా దేవికి సంబంధించిన మంత్రాలను, హోమ, పూజ, పురశ్చరణ విధానాల్ని, ఆ జగజ్జనని సహస్ర నామాల్ని ఉపదేశిం చాడని వర్ణింపబడి ఉంది. ఇలా హయగ్రీవ వరప్రసాదం వల్ల కొద్దిమంది పురాణపురుషులు జ్ఞానసంపదను అందుకొన్నారు. సరే పురాణపురుషుల మాట అలా ఉంచుదాం. ఇటీవల చారిత్రకయుగంలో కూడా అనేకమంది మతనాయకులు, మహాభక్తులు హయగ్రీవస్వామి ఆరాధన వల్ల విజ్ఞానసంపన్ను లయ్యారు. ఇక వారిని గురించి కొన్ని విశేషాలు చెప్పుకొందాం.

## అద్వైత సంప్రదాయంలో హయగ్రీవమూర్తి :

శంకరాచార్యులవారు అద్వైతసిద్ధాంత ప్రవర్తకులు. ఆయన తన విష్ణుసహస్రనామ భాష్యంలో 'తీర్థకరుడు' అనే శబ్దానికి హయగ్రీవుడు అని వ్యాఖ్యానించి హయగ్రీవస్వామితో తనకి పరిచయం ఉన్నట్లు వెల్లడించుకొన్నారు.



## వైష్ణవుల్లో హయగ్రీవారాధన :

వైష్ణవ సంప్రదాయంలో ఆళ్వారుల కాలంనుండి హయగ్రీవ ప్రభువును గురించిన స్తోత్రాలు మనకు కన్పిస్తున్నాయి. నమ్మాళ్వార్, తిరుమంగై ఆళ్వార్ హయగ్రీవ స్వామిని ప్రార్థిస్తూ పాశురాలు చెప్పారు. కులశేఖర ఆళ్వార్ కూడా తన ముకుందమాలలో మధుకైటభులను సంహరించిన హయగ్రీవ విష్ణురూపాన్ని స్మరించారు.

ఇక వైష్ణవ ఆచార్యులలో ప్రత్యేకస్థానం ఉన్న, విశిష్టాద్వైత సిద్ధాంతానికి ప్రవర్తకులైన రామానుజాచార్యుల వారికి హయగ్రీవ కటాక్షం పూర్తిగా ఉందని ఆయన జీవితచరిత్రలోని కొన్ని ఘట్టాలు స్పష్టం చేస్తాయి. ఆంధ్ర పూర్ణుని యతిరాజవైభవంలో, మువ్వయరప్పడి గురు పరంపరా ప్రభావంలో ఈ ఘట్టాలు చక్కగా వర్ణింపబడ్డాయి. రామానుజాచార్యులవారు కాశ్మీరదేశం వెళ్ళినప్పుడు 'బోధాయనవృత్తి' అనే గ్రంథం శ్రీనగరంలో వున్న శారదాపీఠంలో



సంపాదించడానికి ప్రయత్నించారు. కాని శారదాపీఠా కాధిపతులు ఆయనకు అడ్డంకులు కల్పించారు. చిట్టచివరకు గ్రంథం తీసుకొనివెళ్ళడానికి గాని, చూచి వ్రాసుకొనడానికి గాని అంగీకరించకపోయినా కొద్దిక్షణాలు ఆయన తనశిష్యుడు కూరేశునితోబాటు వ్రాతప్రతిని పరిశీలించడానికి అనుమతి చిక్కింది. ఏకసంతాగ్రాహి అయిన కూరేశుడు మొత్తం గ్రంథాన్ని కొద్దిక్షణాల్లోనే స్మృతిపథంలో పదిలపరచుకొన్నాడు. ఈ కథతో బాటు మరో కథకూడ ఉంది. రామానుజుని తీవ్ర జిజ్ఞాసకు మెచ్చి సరస్వతీదేవే స్వయంగా బోధాయనవృత్తి వ్రాతప్రతిని, దానితో బాటు లక్ష్మీహయగ్రీవ విగ్రహాన్ని రామానుజులకు ప్రసాదించిందనేదే ఈ కథ. రామానుజా చార్యులవారి జ్ఞానపుత్రుడు తిరుకురుహై పిరాన్ పిళ్ళాన్ ఈ లక్ష్మీహయగ్రీవ విగ్రహాన్ని వారసత్వంగా పొందాడు అని గురుపరంపరా ప్రభావ గ్రంథం చెబుతుంది.

## వేదాంతదేశికులు - హయగ్రీవ భక్తి :

వైష్ణవ సంప్రదాయంలో ప్రత్యేక ప్రతిపత్తి వున్న వేదాంతదేశికులు చాలా గొప్ప హయగ్రీవ భక్తుడు. హయగ్రీవ



కరుణాకటాక్షం వల్లనే ఆయనకు అపారపాండిత్యం, అద్భుత కవితాధార, అశేష యశోవైభవం లభించాయని అంటారు. చాలా ప్రసిద్ధమైన హయగ్రీవస్తోత్రం ఆ మహానుభావుడు రచించిందే. ఇప్పుడు ఆయన కథ చెప్పుకొందాం. ఆత్రేయ రామానుజులు అనే గురువుగారివద్ద శుశ్రూషచేసి వేదాంతదేశికులు గరుడమంత్రాన్ని ఉపదేశంగా పొందారు. ఆ మంత్రజపాన్ని తీవ్రంగా చేస్తూ ఉండేవారాయన. కంచిలో వైష్ణవప్రచారం చేస్తూ కొన్నేళ్ళు గడిపినతర్వాత తిరువెంది పురానికి వెళ్ళాడు. అక్కడకూడా గరుడమంత్ర జపం తీవ్రంగా చేస్తూ ఉండేవాడు. విశేషం ఏమంటే గరుత్మంతుడు ఆయనకు ప్రత్యక్షమై హయగ్రీవ మంత్రాన్ని ఉపదేశించాడని ఆయన జీవితచరిత్ర మనకు చెబుతుంది. ఆ ఉపదేశం తర్వాత హయగ్రీవ ఉపాసనలో, ఆరాధనలో మునిగి తేలి సిద్ధి పొందాడు. హయగ్రీవుని అనుగ్రహం వల్ల ఎన్నో గ్రంథాలు వ్రాశాడు. ఆయన చాలా ఏళ్ళు గడిపిన తిరువెందిపురంలో ఇప్పటికీ హయగ్రీవ దేవాలయం నిలిచిఉంది. ఈ తిరువెంది పురం తమిళనాడులో కడలూరికి దగ్గరగా ఉంది.

## హయగ్రీవస్వామి మహిమలు :

వేదాంతదేశికుని జీవితంలో హయగ్రీవస్వామి మహిమలు తెల్పే ఘట్టాలు ఎన్నో ఉన్నాయి. అందులో కొన్ని చెప్పుకొందాం.

ఒకసారి వేదాంతదేశికులు కావేరీనదిని దాటి అవతల ఒడ్డున ఉన్న బ్రాహ్మణాగ్రహారానికి భిక్షకోసం వెళ్ళాడు. ఆయన తిరిగివచ్చే సమయానికి నది వరదతో పొంగి పరవళ్ళు తొక్కుతూఉంది. హయగ్రీవుణ్ణి ఆరాధించే సమయం దాటి పోతున్నా విధిలేక అవతల ఒడ్డునే నిలిచిపోవలసి వచ్చింది. అదేసమయంలో వేదాంతదేశికుని ఆరాధ్యదైవం హయగ్రీవుడు ఒక మామూలు గుర్రపు ఆకారాన్ని దాల్చాడు. ఒక పొలంలో ప్రవేశించాడు. అక్కడి పంటధాన్యాన్ని మెయ్యడం ప్రారంభించాడు. ఆ పొలం యజమాని ఇది ఎవరి గుర్రమో పోల్చుకోలేక ఒక గుంజకి దాన్ని బలవంతంగా కట్టాడు.

మర్నాడు ఉదయం వరద తగ్గిపోయింది. దేశికులు తన ఆవాసానికి తిరిగి వచ్చాడు. అక్కడ తన స్వామిని



ఆరాధించుకోవాలనుకొంటే పూజాపీఠం మీద హయగ్రీవుని విగ్రహం లేదు. అప్పుడు ఆయన ఎంతో ఆందోళన చెందాడు. ఒక్కసారి తన ధ్యాననిష్ఠలో కూర్చొని దివ్యదృష్టి సారించి జరిగినదంతా చూడగలిగాడు. తానేమో వరద అడ్డంకివల్ల నైవేద్య సమయానికి రాలేకపోయాడాయె! ఆ సమయంలో హయగ్రీవుడు చేసిన ఈ లీల తలచుకొనేటప్పటికి ఆయన పులకితుడై ఒక ప్రార్థనాశ్లోకంతో తన స్వామిని ఎలుగెత్తి పిలిచాడు. దాని భావం ఇది :

"ఓ హయగ్రీవ ప్రభూ! నీకే కనక నాపై అపార కరుణాకటాక్షం ఉంటే ఇప్పుడు నువ్వు తప్పనిసరిగా తిరిగి వస్తావు. నా తీవ్రమైన బాధను పటాపంచలు చేస్తావు." ఇలా ఆర్తితో ప్రార్థన చేశాడో లేదో హుటాహుటీగా తెల్లని గుర్రం రూపంలో వీధులగుండా పరుగులు తీస్తూ వేదాంతదేశికుల ఇంటివరకు వచ్చి లోపలికి ప్రవేశించి పూజా పీఠాన్ని సమీపించి అదృశ్యమైపోయాడు. మామూలు విగ్రహరూపం దాల్చాడు. మహిమాన్వితమైన ఈ హయగ్రీవలీలకు అందరూ ఆశ్చర్య పోయారు. చేయెత్తి హయగ్రీవునికి నమస్కరించారు.



## ద్వైత పరంపరలో హయగ్రీవారాధన :

మన మతసంప్రదాయాలలో మధ్వాచార్యులవారి పరంపరలో కూడా హయగ్రీవారాధన చాలా ప్రచారంలో ఉంది. మధ్వాచార్యులవారు ద్వైత సిద్ధాంతానికి ప్రతిపాదకులు. ఈయనకూడా హయగ్రీవస్వామిని గురించి అక్కడక్కడా తన గ్రంథాల్లో ప్రస్తావించాడు. "తంత్రసారం" అనే తన గ్రంథంలో శంఖచక్ర పుస్తక జ్ఞానముద్రలు ధరించిన హయగ్రీవుని వర్ణించడమే కాక హయగ్రీవమంత్రాన్ని, దాని ఫలశ్రుతిని కూడా వివరించాడు. 'మహాభారతతాత్పర్యనిర్ణయం' అనే మరో గ్రంథంలో ఈయన హయగ్రీవుని కథ, మధుకైటభుల్ని స్వామి సంహరించి వేదాలను ఉద్ధరించిన ఉదంతం వ్యాఖ్యానించాడు.

## విగ్రహరూపం మారలేదు :

ముఖ్యంగా మధ్వ సంప్రదాయంలో వాదిరాజు గొప్ప హయగ్రీవ భక్తుడు. వాదిరాజస్వామి వ్యాసరాయల శిష్యుడు.



'స్వప్న బృందావన ఆఖ్యానం' అనబడే గ్రంథంలో వాదిరాజు జీవితంలో హయగ్రీవ మహిమలు పొందుపరుపబడ్డాయి. అందులో కొన్ని ఇవి :

ఒకసారి ఒక కంసాలి విఘ్నేశ్వరవిగ్రహాన్ని పంచలోహాలలో పోతపోయాలనుకొన్నాడు. లోహాల్ని కరిగించి మూసలో పోశాడు. తర్వాత మూస ఊడదీసి చూస్తే అక్కడ విఘ్నేశ్వరుని విగ్రహం కనుపించలేదు. హయగ్రీవుని విగ్రహంగా తయారయిఉంది. ఆశ్చర్యం! పరమాశ్చర్యం ! అతనికి ఈ విడ్డూరం అసలు అర్థం కాలేదు. దానిని తన కార్ఖానాలో ఒక మూల పారేశాడు. తరువాత ఎప్పుడైనా మళ్ళీ కరిగించి విఘ్నేశ్వరుణ్ణి చెయ్యాలనుకొన్నాడు. అత్యంతాశ్చర్యకరమైన విషయం ఏమిటంటే చాలాకాలం వరకు ఆ లోహం చల్లారలేదు. చివరకు అతనికి ఓర్పు నశించింది. ఇంక ఏమాత్రం ఆగకుండా ఆ విగ్రహాన్ని దుక్కమీద ఉంచి బరువైన సమ్మెటతో ముక్కలు చెయ్యాలని అనుకొన్నాడు. కాని విగ్రహపు నమూనా రూపం మారలేదు. ముక్కలవలేదు. కంసాలికి చాలా

ఆశాభంగం అయింది. చిట్ట చివరకు విసిగిపోయి ఆ విగ్రహాన్ని మార్చే ప్రయత్నం విరమించుకొన్నాడు.

ఒక రాత్రి కంసాలి నిద్రపోతూఉన్నప్పుడు ఒక కల వచ్చింది. ఆ స్వప్నంలో హయగ్రీవకటాక్షం అతనిమీద పూర్ణంగా ఉందని, ఆ విగ్రహాన్ని భిన్నం చేయడానికి ఇకమీదట ప్రయత్నించవద్దనీ, మరునాడు ఆ విగ్రహం కోసం వచ్చి అర్థించే ఒక యువసన్యాసికి దాన్ని కానుకగా ఇచ్చివేయమని ఒక వాణి వినిపించింది. ఆ కలలో చెప్పినట్లు నిజంగా ఒక యువసన్యాసి మరునాడు ఆ కంసాలిదగ్గరకు వచ్చాడు. హయగ్రీవుని విగ్రహాన్ని అర్థించాడు. పొందాడు. అతడు ఎవరో కాదు. వాదిరాజు. ఈ సన్నివేశం దక్షిణ కెనరా ప్రాంతంలో ఉన్న విశ్వ బ్రాహ్మణకులం వారందరినీ హయగ్రీవ భక్తులుగా జేసిందని చెబుతారు.

## తెల్లని గుర్రం రూపంలో హయగ్రీవుడు :

వాదిరాజు జీవితచరిత్రలో మరో విచిత్రమైన ఉదంతం ఉంది. వాదిరాజస్వామి హయగ్రీవుణ్ణి ఆరాధించి నైవేద్యం అర్పించే సమయంలో సాక్షాత్తు హయగ్రీవుడు ఒక తెల్లని



గుర్రంరూపంలో వచ్చి తినేవాడని ప్రతీతి. ప్రతిదినమూ హయగ్రీవదైవానికి ఇష్టమైన ప్రసాదాన్ని శనగలు, ఎండుద్రాక్ష, కొబ్బరి, యేలకులు, నెయ్యి, బెల్లం, అరటిపండ్లు కలిపి చేసిన ప్రత్యేకమైన నైవేద్యాన్ని వాదిరాజు పూజాసమయంలో తన ఇష్టదైవానికి ఆరగింపుజేసి ఓ పాత్రలో ఈ ప్రసాదాన్ని ఉంచి తన శిరస్సుమీద ఉంచుకొంటే ఓ అందమైన తెల్లని గుర్రం గంతులు వేసుకొంటూ వచ్చి తన ముందరి కాళ్ళను వాదిరాజు భుజాలమీద నిల్పి పాత్రలోని ప్రసాదాన్ని తిని భక్తులకోసం కొంత శేషం వదలి అదృశ్యమైపోయేది. అలా స్వామి గుర్రం రూపంలో ధాటిగా నడచి వచ్చే ధ్వని ఆయనలో ఏదో సమాధి తన్మయత్వాన్ని కలిగించేది. ఆ అనిర్వచనీయమైన అనుభూతిలో ఆయన హృదయంలోంచి కవితాధార వెలువడి, అశ్వధాటి వృత్తంలో హయగ్రీవస్తోత్రాన్ని రచించి స్వామి నైవేద్యాన్ని ఆరగించే సమయంలో గానం చేసేవాడు. ఆ సందర్భంలో ఈ కథకి అతికే మరో కథ ఉంది.



## హయగ్రీవుని విగ్రహం నీలంగా మారడం :

ఆలయంలోని పూజార్లు నైవేద్యంలోని ప్రమాణం తరగి పోవడం చూసి అనుమానపడ్డారు. వాళ్ళ అల్పబుద్ధికి వాదిరాజస్వామి స్వయంగా ఆ ప్రసాదంలో కొద్దిభాగాన్ని బయటకు తీసుకొని వచ్చేముందు తనే తినేస్తున్నాడని వారు భావించారు. అసలు సాక్షాత్తు దైవమే ఈ ప్రసాదాన్ని స్వీకరిస్తున్నాడు అనేది వాళ్ళ ఊహకు అందని విషయం. ఒక రోజున వాదిరాజ స్వామికి గుణపాఠం చెప్పాలని నిర్ణయించు కొన్నారు. హయగ్రీవ ప్రసాదం తయారయిన తరువాత దానిలో విషం కలిపారు. మామూలుగా స్వామికి నైవేద్యం అర్పించే సమయంలో గుడి తలుపులు మూశారు. హయగ్రీవ స్వామి పాత్రలో ఉన్న ప్రసాదాన్ని స్వీకరించిన తర్వాత తలమీదనుండి పాత్రదించి చూసేటప్పటికి నిత్యం సాధారణంగా విడిచిపెట్టే కొంచెం ప్రసాదం కూడా మిగల్చ కుండా ఉండటం చూసి వాదిరాజు ఆశ్చర్య చకితుడైనాడు. ఎందుకని తన ఆరాధ్యదైవం భక్తులకి కాస్త ప్రసాదం కూడా మిగల్చకుండా తినేశాడో ఆయనకి అర్థం కాలేదు.



బయట పూజార్లు ఆదుర్దాగా జరగబోయే సంఘట నను చూడాలని వేచిఉన్నారు. గర్భగుడి తలుపులు తెరిచి ఏరకంగా చెక్కుచెదరకుండా ఉన్న స్వామీజీ బయటకు రావడం చూచేటప్పటికి వాళ్ళకళ్ళను వాళ్ళే నమ్మలేకపోయారు. స్వామీజీ పూజార్ల వంక తిరిగి గద్గద కంఠంతో "ఇవాళ మనకి ప్రసాదం లేదు. హయగ్రీవ స్వామి లేశమాత్రం కూడా మిగల్చకుండా ఆరగించేశారు" అన్నారు. ఆ మాటలు వినగానే పూజార్లు గర్భాలయం లోపలికి వెళ్ళారు. పాత్రలో ఏ మాత్రం ప్రసాదం మిగిలి లేకుండా పరిశుభ్రంగా ఉండటం, గర్భాలయంలోని హయగ్రీవుని విగ్రహం నీలంగా మారి కనిపించడం వారిలో అంతులోని ఆవేదనను కలిగించింది. ప్రతిరోజూ వాదిరాజస్వామివద్దనుండి హయగ్రీవ దైవం సాక్షాత్తుగా నైవేద్యాన్ని స్వీకరిస్తున్నాడనే సత్యం వాళ్ళ బుద్ధికి ద్యోతమానమైంది. వాళ్ళకి తాము చేసిన ఘోరాపరాధం తెలిసివచ్చింది. పరుగెత్తుకొంటూ వెళ్ళి వాదిరాజస్వామి వారి పాదాలమీద పడ్డారు. పశ్చాత్తాపంతో తాము చేసిన తప్పిదాన్ని వెల్లడించి క్షమించమని ప్రార్థించారు.

## రైతుకి హయగ్రీవ సాక్షాత్కారం :

హయగ్రీవుని లీలావిశేషాలు తెలియపరిచే మరో గాథ వాదిరాజు జీవితంలో ఉంది. వాదిరాజు పండరీపురంలో మకాం చేసినప్పుడు ఒక సంఘటన జరిగింది. తెల్లని గుఱ్ఱం ఒకటి పరిసరాల్లో ఉన్న పొలాల్లో పడి శెనగచేను మెయ్యడం జరుగుతూ ఉండేది. పొలం యజమాని ఏదో ఒక తెల్లని గుఱ్ఱం చేను పాడుచెయ్యడం కనుక్కున్నాడు. అతనికి కోపం వచ్చింది. వాదిరాజస్వామివద్దకు వెళ్ళి ఆ గుఱ్ఱం ఆయనదే అనుకొని ఫిర్యాదు చేశాడు. వాదిరాజుకు విషయం అర్థమైంది. ఇదంతా తన స్వామి లీలావిశేషం అని బోధపడింది. ఆ రైతుతో తన వద్ద ఏ రంగు గుఱ్ఱమూ లేదని నిక్కచ్చిగా చెప్పాడు. రైతుకి మాత్రం ఇది ఆశ్చర్యం అనిపించింది. తనే కదా ఈ గుఱ్ఱాన్ని ఇంతవరకు వెంబడించి వచ్చింది. అతనికి ఇదంతా విచిత్రంగా ఉంది. తన ఇంద్రియాలను తను నమ్మలేకపోతున్నాడు. ఇది భ్రాంతో, నిజమో అర్థంకాలేదు. వాదిరాజస్వామికి



నమస్కరించి మీరే నాకున్న ఈ భ్రమని పోగొట్టి సత్యం ఏదో తెలియపరచి అనుగ్రహించమని అన్నాడు.

అప్పుడు వాదిరాజు రైతుకి ఇలా చెప్పాడు: ''బాబూ! నీకు తెల్లని గుఱ్ఱం రూపంలో హయగ్రీవస్వామి సాక్షాత్కరించాడు. అది నీ అదృష్టం. ఒకవేళ నీకు నిరూపణ కావాలంటే మర్నాడు నీ పొలానికి వెళ్ళి నీ పంటను ఒక మారు చూచుకో!'' రైతు ''అలాగే'' అని మరుసటిరోజు పొలానికి వెళ్ళి చూస్తే తెల్లని గుఱ్ఱం తిన్న శెనగమొక్కలు అన్నీ బంగారు గుత్తులతో కనిపించడం అతనికి హయగ్రీవమూర్తి యొక్క మహిమావైభవం అర్థమైంది. అతని ఆశ్చర్యానికి అవధులు లేవు. అతని భక్తిపారవశ్యం కట్టలు త్రెంచుకొని ప్రవహించింది. తెల్లని గుఱ్ఱం రూపంలో స్వామిని సాక్షాత్తుగా దర్శించడంవల్ల అతని జీవితాన్ని కొత్త వెలుగు స్పృశించింది. ఆ రైతు తనకు ఉన్న పొలం యావత్తూ వాదిరాజు మఠానికి వ్రాసి ఇచ్చాడు. ఇలాంటి సంఘటనలు వాదిరాజు జీవితంలో ఎన్నో కనిపిస్తాయి.





## బృందావనం :

మధ్వ సంప్రదాయంలో మనదేశంలో చాలా ప్రసిద్ధి పొందిన మంత్రాలయంలో సిద్ధిపొందిన యతి రాఘవేంద్ర స్వామి. యతులు ఆత్మైక్యం చెందినప్పుడు వారిని సమాధి చెయ్యడం ఆచారం. రాఘవేంద్ర యతి జీవించి యుండగానే 70 ఏళ్ళ వయస్సులో తాను ప్రవేశించటానికి తగిన సమాధిని నిర్మించమని ఆత్మీయ శిష్యులకు పురమా యించారు. ఇలాంటి సమాధుల్ని 'బృందావనం'' అని పిలుస్తారు. ఆ యతుల సమాధిమీద తులసిమొక్క పెరిగేటట్లు చెయ్యడం వల్ల ఈ పేరు వచ్చిందేమో! ఇక రాఘవేంద్రయతి సమాధి అవడానికి హయగ్రీవస్వామికి ఉన్న సంబంధాన్ని గురించిన కథ తెలుసుకుందాం.

రాఘవేంద్రస్వామి సజీవంగా సమాధిలో ప్రవేశిస్తారు అనే వార్త నలుమూలలా పాకింది. ఎంతోమంది భక్తులు ఆ సన్నివేశాన్ని చూడటానికి వచ్చారు. అత్యంత ఆప్తుడైన స్వామీజీ

శిష్యుడు అప్పన్న ఆచార్యుడు ఆ సందర్భంలో రాలేకపోయాడు. అతడు గొప్పకవి. మహాభక్తుడు. రాఘవేంద్రస్వామి సజీవంగా క్రీ.శ.1671 సంవత్సరంలో బృందావనంలో ప్రవేశించారు. అప్పుడు అప్పన్న ఆచార్యుడు మంచాల అనేచోట ఉన్నాడు. ఈ వార్త అతనికి తెలిసింది. అతనికది వజ్రాఘాతం అయింది. కడసారిగా గురుదేవుల్ని దర్శించుకోడానికి హుటాహుటిన మంత్రాలయం వైపుకు నడవసాగాడు. అయినా అతడు ఆఖరిసారిగా గురువర్యుని చూసే భాగ్యానికి నోచుకోలేదు. మంత్రాలయం చేరుకొనేటప్పటికి గురూజీ బృందావనంలో ప్రవేశించడం, ఆ సమాధిని మూసివేయడం జరిగాయి. అతడు ఈ గురువిరహాన్ని భరించలేకపోయాడు. అతడు త్వరత్వరగా వస్తూ పాడుతూన్న గురుస్తోత్రం అయిపోవచ్చింది. విచారంగా ఆ మూసిన సమాధివంక దీనమైన దృక్కులు సారించాడు. అతని కళ్ళవెంట కన్నీరు కట్టలు త్రెంచుకొని ప్రవహింపసాగింది.

**ఆ హయగ్రీవుడే సాక్షి:**

అప్పుడు సమాధిలోఉన్న గురువు తను ఎప్పుడూ వుంటానని, తనకు మృత్యువు లేదని సందేశం అందిస్తూ ఇలా



ఆయన వాణి వినిపించింది. "చూడు నాయనా! నేను ఉన్నాను అనడానికి ఆ హయగ్రీవుడే సాక్షి". సంస్కృతంలో ఉన్న ఈ మాటలు అప్పనాచార్యుని స్తోత్రానికి పూరణగా ఉన్నాయి. తపిస్తూన్న అతని హృదయానికి ఊరట కలిగించాయి. అదే సమయంలో సమాధినుండి హయగ్రీవుని తల బయటకు వచ్చి దర్శనం ఇచ్చినట్లు చెబుతారు.

**మఠాల్లో అధిష్ఠానదైవం :**

ఇంతకుపూర్వం వాదిరాజు జీవిత విశేషాల్లో హయగ్రీవ మహిమలు దర్శించాం. ద్వైత సంప్రదాయంలో వాదిరాజ స్వామి 'సోడే' మఠానికి అధిపతి. విశిష్టాద్వైత సంప్రదాయంలో 'వడగలై', 'తెంగలై' అని రెండు తెగలున్నాయి. అందులో వడగలై సంప్రదాయానికి చెందిన పరకాలమఠంలో అధిష్ఠాన దైవం లక్ష్మీహయగ్రీవుడు. పరకాల మఠాన్ని నెలకొల్పిన స్వామికి కాంచీపురంలో వేదాంతదేశికులతో పొత్తు ఉన్నదని ఒక ఐతిహ్యం. వేదాంతదేశికుని జీవితంలో హయగ్రీవ భక్తి



విశేషాలు, ఆయనపై హయగ్రీవుని అనుగ్రహ విశేషాలు ఎంత బలీయంగా ఉన్నాయో ఇదివరకే చూశాం. పరకాలమఠంలో లక్ష్మీహయగ్రీవ విగ్రహం లక్ష్మీనారాయణ విగ్రహంతోబాటు ఎంతో భక్తిశ్రద్ధలతో ఆరాధింపబడుతుంది. పరకాలమఠ స్వాములకు హయగ్రీవుడు స్ఫూర్తినిచ్చే పరదైవం. ప్రస్తుతం ఈ మఠం ముఖ్యకేంద్రం మైసూరులో ఉంది. అనేక శతాబ్దాలపాటు మైసూరురాజుల పోషణలో వైభవోపేతంగా ఉంటూవచ్చింది. వడయార్‌లు అనే రాజకుటుంబానికి హయగ్రీవస్వామి అంటే చాలా శ్రద్ధాభక్తులు ఉండేవి. ఇటీవలి వరకూ మఠాన్నుండి రాజప్రాసాదానికి హయగ్రీవుని తీర్థప్రసాదాలు వెడుతూఉండేవి.

**ఆగమశాస్త్రాల్లో, తంత్రగ్రంథాల్లో హయగ్రీవుడు :**

హయగ్రీవస్వామిని గురించి పురాణాలు అనేక గాథల్ని సంతరించుకొన్నాయి. ఇక హయగ్రీవుని ఆరాధనకు సంబంధించిన విశేషాలు చెప్పేవంతు ఆగమశాస్త్రాలది - తంత్రగ్రంథాలది.



ఆగమశాస్త్రాల్లో చర్చింపబడిన ప్రధానవిషయం దేవుణ్ణి విగ్రహరూపంలో ఆరాధించడం. ఆ విగ్రహం ఎలా నిర్మించాలి, దాన్ని గుడికట్టి ఆ గుళ్ళో ఎలా ప్రతిష్ఠించాలి, గుడిలో దేవుణ్ణి ఏయే పద్ధతుల్లో పూజించాలి అనే విషయాలు ముఖ్యంగా ఆగమాల్లో చర్చించబడతాయి. ముఖ్యంగా వైఖానసం, పాంచరాత్రం అనబడే వైష్ణవ ఆగమాల్లో విష్ణురూపమైన హయగ్రీవుని గురించిన చర్చ బాగానే జరిగింది. తాంత్రిక భావనలు ఉన్న గ్రంథాలలో హయగ్రీవస్వామిని గురించిన మంత్రాలు, యంత్రాలు, సాలగ్రామాలు వీటన్నిటిని గురించిన విశేషాలు ఉంటాయి.

ఇలా ఆగమాలు, తంత్రగ్రంథాలు హయగ్రీవుణ్ణి పూజించే విషయంలో ఉపాసించే విషయంలో అనేక రహస్యాలు చెబుతాయి. విశేషం ఏమంటే సనత్కుమార సంహిత అనే పాంచరాత్రాగమ గ్రంథంలో హయగ్రీవ లోకం అనబడే ప్రత్యేకలోకాన్ని గురించిన వర్ణనలున్నాయి. శ్రీకృష్ణుడుండే అన్న గోలోకంతో దీన్ని పోల్చవచ్చు. హయగ్రీవ

స్వామి వైష్ణవ సంప్రదాయంలో ఎంత ప్రచారంలో ఉన్నాడన్నది చెప్పడానికి తార్కాణం ''హయశీర్షపాంచరాత్రం'' అని ఒక ప్రత్యేక పాంచరాత్ర గ్రంథం ఉండటమే. దేవాలయం కట్టినప్పుడు దేవాలయ విమానం మీద నాలుగు దిక్కుల్లో ఉండే దేవతా మూర్తుల్లో కూడా హయగ్రీవస్వామిని ఉంచాలని ఆగమ గ్రంథాలు కొన్ని సూచిస్తున్నాయి. హయగ్రీవునికి ఎప్పుడూ ఉత్తరదిక్కుని కేటాయిస్తారు.

## పురాణాల్లో హయగ్రీవ రూపం :

పురాణాల్లో శిల్పశాస్త్రగ్రంథాలలో హయగ్రీవ విగ్రహం ఎలా చెక్కాలి అన్న సమాచారం ఉంటుంది. అగ్నిపురాణం, మత్స్యపురాణం, బ్రహ్మాండ పురాణం, గరుడపురాణంవంటి పురాణాల్లో, ముఖ్యంగా దేవతాప్రతిమ లక్షణాలను గురించి చెప్పే విష్ణు ధర్మోత్తరపురాణంలో హయగ్రీవస్వామి ప్రతిమలు చెక్కవలసిన విధానానికి సంబంధించిన సూచనలున్నాయి. పురాణాల్లో గాని, ఆగమశాస్త్రాల్లో గాని, శిల్పశాస్త్రాల్లో గాని



వర్ణించిన హయగ్రీవరూపం సాధారణంగా ఇలా ఉంటుంది- ఈ స్వామి విష్ణు చిహ్నాలైన శంఖచక్రాలు ధరిస్తాడు. మరో రెండు చేతుల్లో ఒకదానిలో అభయముద్ర గాని వరదముద్ర గాని సూచింపబడుతుంది. అభయముద్ర అంటే భయం లేదు, భక్తుడికి రక్షణ ఇస్తాననే సందేశానికి చిహ్నం. వరద ముద్ర అంటే భక్తుడికి కోరిన వరాలు ఇస్తాను అని చెప్పే గుర్తు.

ముఖ్యంగా కొన్ని కొన్ని హయగ్రీవ శిల్పాల్లో హయగ్రీవుడు ఒక చేతిలో పుస్తకాన్ని మరో చేతిలో అక్షమాలని ధరించి ఉన్నట్లు కనబడతాడు. హయగ్రీవుడు పుస్తకం ధరించడంలో విశేషం మహాభారతకథలో ఆయన వేదాల్ని ఉద్ధరించిన కథ స్ఫురింపజేస్తుంది. అదేగాక ప్రార్థించే భక్తులకు సర్వవిజ్ఞానాన్ని ప్రసాదించే ప్రభువు ఆయన అని తెలుపుతుంది. అక్షమాల జపం చెయ్యడానికి ఉపయోగిస్తారు. జపం, ధ్యానం, తపస్సు, సమాధి యివన్నీ జ్ఞానచిహ్నాలు. అందుకని ఈ అక్షమాల కూడా జ్ఞానానందమయ మూర్తి లక్షణాలకు అనుగుణంగానే ఉంటుంది.



## జ్ఞానానందమూర్తి:

హయగ్రీవస్వామి శరీరవర్ణం ధగధగ మెరిసిపోయే ధవళఛాయ అని అనేక గ్రంథాలు చెబుతాయి. హయగ్రీవుని శరీరఛాయ ఆకాశగంగలా, అమృతంలా, తెల్లతామరలా, మల్లెపూవులా, శ్వేత కుముదంలా, చంద్రునిలా తెల్లగా మెరుస్తూ ఉంటుంది. ఒక్కొక్కసారి హయగ్రీవస్వామి తెల్లని తామరపువ్వులో కూర్చొన్నాడనే వర్ణనకూడా మనకు కనిపిస్తుంది. ఆ స్వామి వెనక పూర్ణచంద్రమండలం నేపథ్యంగా ఉంటుంది. అదీ తెలుపు రంగు. తెలుపు స్వచ్ఛతకి చిహ్నం. సత్యానికి ప్రతీక. జ్ఞానానికి మారురూపు.

## హయగ్రీవ శిల్పాలు:

వందల వందల ఏండ్లనుండి భారతదేశచరిత్రలో హయగ్రీవ ఆరాధన జరుగుతూనే ఉంది. హయగ్రీవస్వామికి సంబంధించిన విగ్రహాలను గురించిన సమాచారం కుషాణ



రాజుల కాలంనుండి మనకు లభిస్తూనే ఉంది. క్రీస్తుశకం ప్రారంభంలో కుషాణశిల్పానికి సంబంధించిన ఒక హయగ్రీవ విగ్రహం కాశీలో ఉంది. ఇది వారణాసి హిందూవిశ్వ విద్యాలయంవారి భారతీయకళాభవనం అని పిలవబడే మ్యూజియంలో భద్రపరచబడింది.

తర్వాత గుప్తరాజుల కాలంలో కూడా హయగ్రీవ విగ్రహాలు చెక్కబడ్డాయి. గుప్తరాజుల చివరిదశలో కూడా ఉత్తరదేశంలోని మధురకు చెందిన హయగ్రీవశిల్పం ఒకటి బెర్లిన్ నగరంలో ఉంది. ఇది క్రీ.శ. 7వ శతాబ్దంనాటిది. దీనిలో విశేషం ఏమంటే ఒక శిలకి నాలుగువైపులా నాలుగు విష్ణురూపాలు చెక్కి ఉండటమే. ఒకవైపు మామూలు మానవాకారంలో ఉన్న విష్ణురూపం తక్కిన మూడువైపులా వరాహ, నరసింహ, హయగ్రీవ రూపాలు. విష్ణువు విశ్వం అంతటా ఉన్నాడు అని తెలియపరిచే రూపం విశ్వరూపం. అనేకచోట్ల విశ్వరూపశిల్పాలు కూడా మన చరిత్రలో

వెలసినాయి. మనకు కనిపిస్తున్న విశ్వరూపశిల్పాలన్నిటిలో హయగ్రీవుడున్నాడు. ప్రసిద్ధమైన శ్రీరంగదేవాలయంలో తదితర దేవాలయాల్లో హయగ్రీవస్వామి శిల్పాలు చెక్కారు.

## విదేశాలలో హయగ్రీవుడు :

దేశంలోనే కాదు విదేశాలకు కూడా హయగ్రీవమూర్తి వ్యాప్తి చెందాడు. హయగ్రీవశిల్పాలు ఆగ్నేయాసియా దేశాల్లో కూడా ఉన్నాయి. దీనికి కారణం భారతీయ సంస్కృతీ సభ్యతలు, మత విశ్వాసాలు, కళా వైభవాలు జావా, బోర్నివో, సుమత్రా ద్వీపాలతో కూడిన ఇండోనేసియాలో, బలిద్వీపంలో, కంబోడియా, థాయ్‌లాండు అనే ఆగ్నేయాసియా దేశాల్లో వ్యాపించినై. అక్కడ హిందూమతానికి, బౌద్ధానికి సంబంధించిన విశ్వాసాలు, ఆలయాలు, ఆరామాలు విలసిల్లినాయి. దేశదేశాల్లో వ్యాప్తిచెందిన మనసంస్కృతికి చిహ్నంగా అక్కడ హయగ్రీవ శిల్పాలు ఉండటంలో ఆశ్చర్యం లేదు. ఇక్కడ మరొక్కమాట చెప్పుకోవాలి. హయగ్రీవారాధన మహాయాన బౌద్ధంలో కూడా



బహుళప్రచారం పొందింది. బౌద్ధమతంలోని మంత్ర యానంలో హయగ్రీవుని ఉపాసనావిశేషాలు మనకు కనబడుతున్నాయి. బౌద్ధంద్వారా హయగ్రీవ దైవాన్ని గురించిన ఉపాసన నేపాల్, టిబెట్, చైనా, జపాన్ దేశాల్లో వ్యాపించింది.

## బహుళప్రాచుర్యం:

మనదేశంలో హయగ్రీవుని ఆరాధన ఏదో ఒక ప్రాంతానికి పరిమితమై లేదు. కాశ్మీరంలో కన్పిస్తున్న వైకుంఠశిల్పంలో హయరూపం ఉండటం, రాజస్థాన్, మధ్యప్రదేశ్‌లలో విరివిగా కనిపించే హయగ్రీవ శిల్పాలు, నేటికీ అస్సాంలో ''హజో'' అనేచోట హయగ్రీవ మాధవ దేవాలయంలో జరుగుతున్న పూజాపునస్కారాలు, దక్షిణా పథంలో అనేక దేవాలయాల్లో ఉన్న హయగ్రీవ మూర్తులు, ప్రత్యేకంగా తిరువెందిపురంలో ఉన్న హయగ్రీవ దేవాలయం, పరకాల సోడె మఠాధిపతులు ఇప్పటికీ పరంపరగా



హయగ్రీవుని అధిష్ఠానదైవంగా ఆరాధించడ ం, శాస్త్రాలు చదువుకొనేటప్పుడు, విజ్ఞాన చర్చలు చేసేటప్పుడు నిర్మలమైన స్ఫటికాకారంగల ఈ దివ్యమూర్తిని స్మరించడం ఈ హయగ్రీవ దైవం యొక్క బహుళ ప్రచారానికి, ప్రాచుర్యానికి నిదర్శనాలు.